# అల్లుడి ఎన్నిక

కథకుడు:

***సజ్జాద్ హైదర్‌యల్దరమ్***

రచయిత ఉర్దూ వాఙ్మయ సుప్రసిద్ధ కథకుడు. "ఖయాలిస్తాన్" "హికాయతు" అన్న రెండు కథల సంపుటాలు ప్రచురించాడు.—
రచయితకి తుర్కీ-భాషలో మంచి ప్రవీణత వుంది. 'తుర్కీ-అఫ్సానే' అన్న కథల సంపుటి ఈతని తుర్కీ-కథల అనువాదాల ఫలితమే.
సమకాలీనులని గురించి పైరెండు పరిచయవాక్యాలు తప్ప యెక్కువగా చెప్పటం భావ్యంకాదని తలచి యింతటితో విరమిస్తూవున్నాను.

—భాస్కరభట్ల

భాస్కరభట్లవారి అనువాదం

షేక్ ఉమ్రావుల్ల మంచి భగవద్భక్తుడు. యెల్లప్పుడూ తన కాలాన్నంతా భక్తి, ప్రార్థనల్లో గడిపేవాడు. యెందరో యిరుగు పొరుగు పిల్లలు పెరిగి పెద్దవాళ్లయినారు, కాని అతను మాత్రం వొక్క-వాడు కూడా వాళ్ళ బాగోగులనిగురించి పరామర్శించి యెరగడు. యిటువంటి పనులతో అతనికి ప్రసక్తేలేదు. అతిథి, అభ్యాగతులసంగతి అతనికి అసలేపట్టదు.

హాటాత్తుగా, ప్రశాంతంగా గడుస్తూవున్న అతనిజీవితంలో కొంచం కలవరపాటు పుట్టింది. అతనికి వొక్క-తే వొక్క- కూతురుంది. ఆమెపేరు జమీలా. ఆమెకు రెండు సంబంధాలు వొచ్చాయి. పెళ్లికొడుకు లిద్దరూ డాక్టర్లే ఉమ్రావుల్ల వీళ్లిద్దరిలో యెవరినైనా తనకూతురకోసం ఎనుకోవాలి. పాపం అతనికి ప్రపంచం అంటే యేమిటో అసలే తెలియదు. యిట్లాంటి పరిస్థితుల్లో అల్లుణ్ణి ఏరుకోవటమనేది ఉమ్రావుల్లాకి చాలాకష్టంగా తోచింది. సమస్యా పరిష్కారమయ్యే మార్గమేదీ కనపడలేదు. అల్లుళ్ళిద్దరినీ అతనెప్పుడూ చూడలేదు. స్వభావాన్నిబట్టి వాళ్ళెటువంటివాళ్లో సంబంధ బాంధవ్యాలకోసం తెలుసుకోవటం అత్యవసరం

అసలు ఉమ్రావుల్ల పూర్వాచారపరాయణుడు. వెనకటి ఆచార వ్యవహారాలంటే చాలా పట్టుదలకల మనిషి. ఇస్లాం మతం అంటే అతనికి మూఢవిశ్వాసం కూడా వుంది.

తన అల్లుడిలో మంచి భక్తి, నమ్రత, ఇస్లాం మతవిశ్వాస ముండాలని అతని కోరిక.

ముసలి ఈ సమస్యనిగూర్చి తీవ్రంగా ఆలోచించాడు. యేమీపాలు పోలేదు. అయినా యేదైనా నిర్ధారణకి రాకతప్పదు. ఈ సందిగ్ధావస్థలోంచి బయటపడటానికి రెండురోజులు పట్టింది. మూడోనాడు చక్కని వొహ ఆలోచన ఆతని తట్టింది.

కాలక్రమేణ వొహ ముసలిది అతని యింట్లో అనాహ్వాన అతిథిగా ప్రవేశించింది. పాపం వొచ్చిన వేళా విశేషమేమో అన్నట్లు యింట్లో కాలుపెట్టిన దారభ్యతా మంచం పట్టింది. నెలరోజులయినా మనిషి యింకా కోలుకోలేదు. పాపం ముసలిదానికి వొహ ఘోర జ్వరం—వొహటేదగ్గు, మనిషి తొందరలో బాగయ్యే లక్షణాలేవీ కనపడలేదు.

ఉమ్రావుల్లాకి ముసలిదాని ఉపచారంకోసం తనకు కాబోయే యిద్దరు అల్లుళ్లనీ అహ్వానించాలని కోరికపుట్టింది.

భార్యతో ఈవిషయం ప్రస్తావించి చూచాడు. యిద్దరు పెళ్లికొడుకుల చూచే అవకాశం ఈ పన్నుగడవల్ల లభిస్తుందని ముసలిదికూడా సంతోషించింది.

భార్యాభర్త లిద్దరూ ఈ అహ్వానాన్నిగూర్చి "సరే"నంటే "సరే" ననుకున్నారు.

జ్వరంతో మంచంపట్టిన ముసలిది ఉమ్రావుల్లాకి దైవం పంపిన దూతగా కనపడింది. కృతజ్ఞతాసూచకంగా చేతులుకట్టుకుని వొహ నిముషంవరకూ ఈ దైవిక సంఘటనకి ప్రార్థనకూడా చేశాడతను.

మరునాడుదయమే లేచి, మొహం అదీ కడుక్కొని, నమాజు చేసి, తన కాబోయె యిద్దరు అల్లుళ్లకీ ఉత్తరాలు వ్రాశాడు,

* * * *

3 వజులై ఉదయం ౧౧గంటలు—;

ఈరోజు ఉదయమే యేడింటికల్లా నాకు రెండు ఉత్తరాలు వొచ్చాయి. వొహటి నాకు కాబోయే మామగారిదగ్గరినించి, యింకొకటి నా భావిజీవితానికంతా, వెలుగూ ప్రకాశాన్నీ ప్రసాదించే నా ప్రియురాలి దగ్గరినించి—

ఉమ్రావుల్ల వ్రాసిన వుత్తరంలోని సారాంశమిది—

యింట్లో యెవరో అకస్మికంగా జబ్బుపడ్డారని వ్రాశాడతను, యింటికి అల్లుణ్ణి కాబోయే నేనే ఉపచారంచేస్తే యెక్కు-వశ్రద్ధ కనపరుస్తానని నమ్మకంవల్ల నన్ను అహ్వానించాడు.

జమీలావుత్తరం వేరేవిధంగావుంది. పైవుత్తరానికీ దీనికీ అసలు పోలికే లేదు.

దేవుడూ మతాన్నిగూర్చి నానావిధాలుగా పిచ్చిగా మాట్లాడుతావే, ఆ నీ భావాలనుగూర్చి కొంచెం దగ్గరగావుండు. నాన్నగారి ముందు నీపిచ్చికూతలు కాస్తవొదిలి ఇస్లాం మతావేశాన్ని నటించు, దైవభక్తి, మూఢనమ్మకం కనపర్చటంలో కార్యసాధనవుంది. యింట్లో యెవరో ఆకస్మికంగా జబ్బుపడ్డారన్న మిషమీద నిన్ను యింటి-డికి రప్పించటానికి వొహ నెపం. అసలు నీవుయిక్క-డికివస్తే నీతో మాట్లాడి, నిన్ను జాగ్రత్తగా పరీక్షించాలని వాయనగారి ఉద్దేశ్యం. వారు పూర్వాచారపరాయణులూ, భగవద్భక్తులూ అన్నవిషయం జ్ఞాపకం వుంచుకుంటే నీవు తప్పకుండా ఈ పరీక్షలో నెగ్గుతావని నా నమ్మకం"

"ప్రియురాలు"

"జమీల"

"P.S. అన్నట్లు మరిచిపోయినా, నన్ను పొందటానికి నీతో సహా పోటీ చేస్తున్నాడే అతనికి కూడా వొహవుత్తరం వ్రాశాను. నాన్నగారికి నవీనభావాలూ, నవీనసభ్యతా అంటే చాలాకష్టమనీ, అందుకోసం వొచ్చేటప్పుడు పూర్తిగా అతన్ని "సూటు"లో రమ్మనీ, వారితో మాట్లాడేటప్పుడు ఎక్కువగా ఇంగ్లీషుముక్కలు ఉపయోగించమని వ్రాశాను,

ఏం! సబబా బాగుందంటావా లేదా. అమ్మో, దొంగా, బాగుందనకుండా యేం చేస్తావు"—

౫వజులై, సాయంత్రం—

ఈరోజు వుదయం నాకు కాబోయే మామగారింటికివెళ్లాను. డాక్టరైనా కోటూ, ప్యాంటూవొదిలి షేర్వానీ, నెమ్మటోపీ పెట్టుకొని అతనిని సంసారపక్షంగా దర్శించాను. అతను నాకు ఆదరాభిమానాలతో స్వాగతం చెప్పి రోగి గదిలోకి నన్ను ఆహ్వానించాడు. రోగిని పరీక్షించి గదిలోంచి యివతలికి వొచ్చిన తరవాత మాకిక్రిందివిధంగా సంభాషణ జరిగింది.

"రోగిసంగతి యెట్లావుంది"

"యేమీ చెప్పేట్టులేదు, పరమాత్ముడికృప మాత్రం సంపూర్ణంగా వుండాలి."

పరిస్థితులు ఆశాజనకంగా లేవా"

"పరమాత్ముడికి తెలియాలి, మనుష్యమాత్రుడికి యేం తెలుసు"

"ఆశ వొదలుకోవటమేనా"

"అసర్వజ్ఞుడి కటాక్షం మాత్రం వుండాలి. అదిలేకపోతే మనుష్యప్రయత్నం యేంలేదని సహాయపడుతుందని."

ఉమ్రావుల్ల నన్ను యెన్నోప్రశ్నలు అడిగాడు. యెన్నోవిధాలుగా పరీక్షించిచూచాడు. దాదాపు వొహగంటవరకు అక్క-డ గడిపి, రోగికిమందిచ్చి, మందు పుచ్చుకొనే విధానం వివరంగా చెప్పి యింటికి తిరిగివొచ్చాను.

౭వ జులై—

ఈరోజు రోగిని మళ్లీచూడటానికివెళ్ళాను. రోగికి కొంచంగా నిమ్మళించింది. మనిషి కొస్త చురుగ్గా కూడా కనపడింది.

"మీ ప్రయత్నంవల్ల పాపం ఆ బాధకి కొంచం నెమ్మదిఅయింది"

"నా ప్రయత్నమేమి, నేనెంత అసలు ఆ పరమాత్ముడి కృపలేకపోతే"

తరువాత జమీలాతో కొద్దిగా మాట్లాడి యింటిముఖం పట్టాను.

౧౨వజులై, రాత్రి సుమారు ౧౧ గంటలు

యీరోజు యింటికి ఆలస్యంగావొచ్చాను. వచ్చేటప్పటంతో నే టేబిలుమీద జమీలా వుత్తరం కనపడింది.

నా సంతోషానికి మేరలేదు. జమీలా నాది. ఉమ్రావుల్ల జమీలాని నాకివ్వటానికి నిశ్చయించుకున్నాడట.

నా సంతోషానికీ, విజయానికీ కారణభూతురాలయిన జమీలావుత్తరం ఈ క్రింది విధంగా వుంది,

"ఈరోజు సాయంత్రం నాన్నగారు రోగితో మాట్లాడుతూ నన్ను నీకేయిస్తానన్న నిశ్చయాన్ని వెలిబుచ్చారు. మాటల సందర్భంలో నీతో సహా పోటీచేసిన "అలక్నో అబ్బాయి" సంగతికూడా వొచ్చింది. అమాటల సారాంశమేమంటే, దేవుడూ, దైవమూ అంటే అతనికి అసలే భక్తిలేదనీ, ఇస్లాంమతమంటే హీనంగా చూచి, దేవుడి అస్తిత్వాన్నే సందేహిస్తాడనీ అతన్ని నిరాకరించారట."

"ప్రియురాలు"

"జమీల"

## ప్రకటన

ఇందువల్ల సమస్త జనులకు తెలియపరచుట యేమనగా తాలూకా వ జిల్లా నల్లగొండలో చేరిన పానగల్లు గ్రామమున శిద్ధిరామురాంబ జప్తరై సోమయ్య తన స్వంతశిఖం నాకు విక్రయించియున్నది. ఆయన స్వాధీనమైనది. ఇట్టి ఇంటిపను మెపై యెవరికైన ఆక్షేపణ యున్నయెడల ౨౦ దినములలో తమ ఆక్షేపణ తెలుపగలరు. గడువుదాటినపిమ్మట ఎవరి ఆక్షేపణలూ విననబడవు.

ఇట్లు

వేంకటరామారావు

# రాజకీయ సంస్కరణములకై ప్రజాభిప్రాయాహ్వానము

మాసములోగా ప్రజలు, సంస్థలు, తమ యభిప్రాయములు తెలుపవలెను

హైదరాబాద వర ౨౬

ము. ఖు. వ. నిజాం ప్రభువుగారి ఆజ్ఞానుసారము ౨౨ సెప్టెంబరు తేదీన దివాన్‌బహదర్ అరవముదు అయ్యంగారి అధ్యక్షత క్రింద నొక ప్రత్యేకకమిటీ క్రింది విచారణీయాంశములకై నియమింపబడియుండెను:—

రాష్ట్రీ పరిస్థితుల అవసరములు దృష్టియందుంచుకొని రాష్ట్రీమందలి వివిధ అభిమతములు అకోరికలు ప్రభుత్వము వారికి విశదమగునటుల వివిధఅభిమతములకు ప్రభుత్వమునకు సంబంధము కలుగుటకై పలయుమార్పుల విచారించి నివేదించుట"

ఈవిషయమునందు అభిరుచిగల రాష్ట్రీమందలి సంస్థలు, వ్యక్తులు తమ ప్రాతినిధ్యములను, అభిప్రాయములను ఆలోచనీయాంశములననుసరించి, కమేటీ కార్యదర్శులగు యస్. యూసుఫలీ హెచ్. సి. యస్. సైఫాబాద హైదరాబాద గారికి బంపిన యీ ప్రత్యేక కమిటీవారి కృషికి యెంతయో సౌకర్యములు కలుగునని మహోఘనతవహించిన ప్రభుత్వము వారభిప్రాయపడుచున్నారు. కమేటివారికి ఆ విషయములగురించి పూర్తిగా ఆలోచింమ అవకాశమేర్పడుటకై, ప్రాతినిధ్యము బంపదలచినవారు మాసములోగా వివరముగా బంపగలరని ప్రభుత్వ ప్రకటనశాఖవారు తెలుపుచున్నారు.

## ఆంధ్ర సోదరీమణులకు మనవి

ఆంధ్రమహిళాసభస్థాయి సంఘ కార్యదర్శిని గారు ఇట్లు వ్రాయుచున్నారు:—

"నిజామాబాదునందు ఈశ్వరసంవత్సర మార్గశిరశు॥ 3, ర, ౫, సోమ, మంగళ, బుధ వారములలో జరుగు ఆరవ ఆంధ్రమహాసభతో పాటు మహిళామహాసభ శ్రీమతినందగిరి ఇందిరాదేవి గారి యాజమాన్యమున జరుగుచున్నది. ౨౪-౧౧-౩౭ బుధవారము నాడు శ్రీమతి బూర్గుల అనంతలక్ష్మీదేవి గారి గృహమందు వారి యాజమాన్యమునక్రింద స్థాయిసంఘసభ్యురాండ్ల సమావేశమై అతి బాల్యవివాహము, వితంతువుల వివాహము వికలాంగ పునర్వివాహము మాతృభాషద్వారా నిర్బంధప్రారంభవిద్య వ్యాయామ దర్శనమక్కులు ముంతకాపనిపని అప్పృశ్యతానివారణ దేశీయపరిశ్రమ వారసత్వపుహక్కులు బహుభార్యాత్వము మొదలగు నవి తీర్మానములను మహాసభలో ప్రవేశపెట్ట దలచినారు. కావున విద్యావంతులగు సోదరీమణులెల్లరు మహాసభలో పాల్గొని జయప్రదగావింపవలయునని ప్రార్థన.

## నిజాంరాష్ట్రీ పరిషత్తు

ప్రశ్నావళి తయారైనది

హైదరాబాదు: నవం, ౨౮

మొన్న సాయంత్రముసమావేశమైన నిజాంరాష్ట్రీ ప్రజాపరిషత్తు స్థానిక స్వపరిపాలన ఉపసంఘ సమావేశమునందు స్థానిక స్వపరిపాలనా సంఘముల గూర్చిన ప్రశ్నావళి తయారగుటతో పరిషత్తు ప్రశ్నావళి సంపూర్ణముగా సిద్ధమైనది.

రాజ్యాంగ సంస్కరణల ఉపసంఘ ప్రశ్నావళియందు శాసనసభా విస్తరింపబడి యెన్నుకొనబడిన సభ్యులు అధికముగా నుండి, ప్రభుత్వ మంత్రాంగమునందు ముఖ్యభాగముగా నుండుటకు ఏయేవిధానము లవలంబింప వలయును? రాష్ట్రీమునందు రెండుసభ లుండవలసిన యావశ్యకముగలదా? లేక యొకసభయేచాలునా? ఎన్నికలు యేపద్ధతి ననుసరించి జరుపవలయును? ప్రభుత్వము శాసనసభకు బాధ్యత వహించుటకు యెట్టినిబంధన లవసరము? పౌరసత్వముల రక్షణకై యెట్టివిధాన మవలంబింపవలయును, స్వల్పసంఖ్యాక వర్గముల కెట్టిరక్షణలు కావలసియుండును, సూచించుటకు కోరబడెను.

నియోజక ఉపసంఘమునందు సాధారణ నియోజకవర్గములందు యెట్టివిధానముల నవలంబింపవలయును, ప్రత్యేక యెన్నికలు జరుపుట చితమా? లేక సంయుక్తపు యెన్నికలు జరుపుట బాగా? స్త్రీ నియోజకవర్గముల కెట్టి పద్ధతు లవలంబింపవలెను, వెనుకబడిన జాతులకు, కార్మికవర్గములకు యెట్టి యెన్నిక విధానము నాచరణలో నుంచవలయునో సూచించుటకు పృచ్ఛింపబడెను.

స్థానిక స్వపరిపాలనా ఉపసంఘము ప్రశ్నావళియందు ప్రస్తుతముగల తాలూకా,జిల్లా పాలకసంఘముల యధికారమెంతవరకు హెచ్చింపవలయును, వానికి యే అధికారముల నొసగవలయును; గ్రామపంచాయతి సంఘములు నెలకొల్పబడిన ఎన్నికపద్ధతి యేవిధముగా నుండవలయును? ఈ సంఘములకు న్యాయపంచాయతి అధికారము యొసగబడవలయునా లేదా అభిప్రాయము తెలుపుటకు కోరబడెను.

ఈ ప్రశ్నావళి నగరజిల్లా ప్రముఖులలో సుమారు ౫౦౦మందికి అభిప్రాయార్థము పంపబడునని తెలుపబడుచున్నది.

# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర కార్తీక బ॥ ౧౫

గురువారము

## ప్రాథమిక విద్యాసంస్కరణములు

సయ్యద్ మహమ్మద్ హుసేన్ జాఫరీ గారి అధికారముక్రింద మనవిద్యాశాఖ సంతోషకరమైన నూతనాభివృద్ధి మార్గము త్రొక్కుచున్నట్లు కనబడుచున్నది స్థలాంతరమున ఈవిషయమును తెలిపిన విశేషములు ప్రకటించ బడినవి. ఆవివరములన్నియు చూచినచో విద్యాశాఖయొక్క ప్రయత్నము, సాధ్యమైనంత శీఘ్రకాలములో మనరాష్ట్రజనసంఖ్యా సౌకర్యావసరములను బట్టి అవసరములైనన్ని ప్రాథమిక పాఠశాలలను స్థాపించుటయు, చదువవలసిన ఈడువచ్చిన ప్రతివాడును ప్రాథమిక విద్యమట్టుకైనను తప్పక నేర్చుకొనునట్లు చేయుటయు, ఆనేర్చబడు ప్రాథమికవిద్యను మనుష్యుడు వివేకముగల మనుష్యుడుగ తెలివితోను ధైర్యములోను జీవించుటకు సహాయకారిగ నుండునట్లు చేయుటయునై యున్నట్లు తోచగలదు.

ఇపుడు మనరాష్ట్రమందు విద్యావిషయమునందు మొట్టమొదటి అవసరము ప్రాథమిక విద్యావ్యాప్తి యని అందరు అంగీకరించిన విషయమే. ౧౩౪౪ ఫ ఆంతమునందు మనరాష్ట్రమునందు ౪౩౬౮ ప్రాథమిక పాఠశాలలుండెను. అనగా ౧౮ చదరపుమైళ్ల దూరమునకు మించిన దూరమున కంతయు ఒక్క ప్రాథమిక పాఠశాలయని తేలినది. నిజముగా ఇదిచాలదు. ఈ లెక్కన చూచినచో అధమపక్షము ఇప్పటికంటె ఆరింతలకు ప్రాథమిక పాఠశాలలసంఖ్య హెచ్చవలసి యుండును. ఈ ౪౩౬౮ పాఠశాలలలో చదువుచుండినవిద్యార్థులసంఖ్య ౨౭౬౧౯౭. ఇచట సాధారణముగా ప్రాథమిక విద్య చదువువిద్యార్థులవయస్సులు ౭ కును ౧౧ కును మధ్యనుండును. కాని ఆ వయస్సులమధ్య నుండుజనులసంఖ్య ఎంతో తెలియదు. కొంచెము దగ్గర దగ్గరగ ౫ ఏండ్లకును ౧౦ ఏండ్లకును మధ్యనుండువారల సంఖ్యకది సమానమని భావించినచో, ఆట్టిజనులసంఖ్య ౧౭౫౫౦౦౩ ఉండును. ఈసంఖ్యలో ఇపుడు చదువుచున్న వారలసంఖ్య ౬ వ భాగము మాత్రమే. అనగా ఇప్పటి విద్యార్థుల సంఖ్యలోను, పాఠశాలల సంఖ్యలోను (కాదా?) ఒక్కటే లెక్కన హెచ్చింపు జరుగుట అత్యవసరమని అర్థము. ఇట్టి స్థితిలో ౧౩౩౦ ఫ. నుండి ప్రాథమిక విద్యాసౌకర్యముల వ్యాప్తివిషయమున శ్రద్ధజూపని విద్యాశాఖ విధానముయెడ ప్రజాభిప్రాయ మంతయు ప్రాతికూల్యము జూపుట ఆశ్చర్యకరముకాదు.

నూతన విద్యాశాఖాధ్యక్షుల వారు ఈలోపమును తీర్చుటకు తొందరపడుచున్నారు. ఈలోపమును తీర్చవలెనని నకిపము ప్రతిగ్రామమునందును ఒక ప్రాథమిక పాఠశాలనైనను స్థాపించుట అవసరముగును. పట్టణములలో పాఠశాలఏర్పాటు ఒకటి, గ్రామములలో ఏర్పాటువేరు. ఏమన, గ్రామములలో పిల్లను పట్టణములలోవలె ప్రతిరోజు పదిగంటలమొదలుకొని సాయంకాలము ౪ గంటలవరకు నడుపుచో చదువుకొను విద్యార్థులుండరు. ఆ వేళ రైతుల విద్యార్థులు పొలములలో తమ తల్లిదండ్రుల పొలముపనలకు సహాయపడుచుందురు. ఈవిషయము మనదేశమందు ఇంతకాలము కూడ గుర్తించబడక సాగిపోవుచుండుట విచారకరము. క్రొత్తవిద్యాధికారిగారు ఇది గుర్తించి, గ్రామములలో బళ్ళు ఉదయకాలములలో పని సాగించునట్లు ఏర్పాటు చేసినారు. ఈలెక్కన ఒక పదేండ్లలో ప్రతిగ్రామమందును ఒకబడి ఏర్పాటు చేయుటకు ప్రోత్సాహముండునని ధైర్యముతోనున్నారు.

అంతేగాక సాధారణ ప్రాథమిక పాఠశాలల సంఖ్యకూడ ౩౦౦ నుండి ౫౦౦ కు హెచ్చింప బడుటయేగాక, ఇపుడున్న వాటిలో అవసరములైన సంస్కరణములుకూడ చేయబడినట్లు తెలుపబడినది. ఈ హెచ్చించుటకును. సంస్కరణలకును అధనముగ ఖర్చేమియు చేయబడలేదనియు, ఇప్పుడు వ్యర్థముగా నష్టమగుచున్న మొత్తములను మిగిలించుకొని ఈపనులు సాధించబడినవనియు తెలుపబడినది. అట్లైనచో రైట్ ఆనరబల్ సర్. అక్బర్ హైదరీగారు ఆర్థికశాఖామంత్రిగ నున్నపుడాక ఆర్థికనివేదనపత్రము (బడ్జటు) లో, ఇకమీదట ఎక్కువఖర్చులు చేయవలసియుండు శాఖలు ఆర్థిక శాఖనుండి ద్రవ్యసహాయమపేక్షించక, తమమార్గము తాముచూచుకొనుట మంచిదనియు, ఇపుడు ఖర్చులు తగ్గించుకొని మిగిలించు కొనుటకు అవకాశములు గలవనియు అని చేసినసూచనను ఆచరణలో పెట్టుచున్నట్లు మొట్టమొదట వెల్లడియైనశాఖ యనిపించుకొనుగౌరవ విద్యాశాఖకు దక్కగలదు ఎట్టిఖర్చులు తగ్గించబడుచున్నవను సంశయములుకూడ ముఖ్యములు, కావున ఆ విషయమును విద్యాశాఖవారు ప్రజలకు తెలియజేసి వారల విశ్వాసము పొందగలరని ప్రజలాశించగలరు.

ఆ తెలిసినవారవై ఖరీ మూడవిర్బంధప్రాథమిక విద్యావిధానమును ప్రవేశపెట్టుటకు అనుకూలపరిస్థితులు ఈ ప్రయత్న ఫలితముగానేర్పడగలవని విద్యాశాఖవారు నమ్మకముతో నున్నట్లు కనిపించుచున్నది. ఆనమ్మకము ధృవపడిన సంతోషమే. ఈలోగానే నిర్బంధోచిత ప్రారంభవిద్యాశాసనమును ప్రభుత్వమువారు సంతృప్తికరముగ తయారు చేయించి, దానిని శాసనసభవారిచే ఆమోదింపజేయుట నష్టకరముకాదు.

విద్యాశాఖవారు ప్రాథమికవిద్యవిషయమున తలపెట్టిన ఇంకొక సంస్కరణము చాల అపేక్షణీయమైనది. ఏలనన చాలమంది ప్రాథమికవిద్యతో చదువు ముగించుచుందురు. కాని మానవుడు మానవుడుగ ఈలోకమున ఇప్పటిపరిస్థితులమధ్య సుఖస్థైర్యములతో జీవించుటకు ఆమాత్రము విద్య చాలదు. కనుక విద్యాశాఖాధ్యక్షులవారు ప్రాథమిక విద్యాదశను అయిదేండ్లనుండి ఆరేండ్లకు పెంచుటకు ప్రయత్నించుచున్నారట. ఇదియే నిజమైనచో ఒక కాలమును హెచ్చించుటయేగాక ౬ ౫ ఏండ్లలో ఇపుడు ఆరేండ్లలో నేర్పునుచున్న విద్యలలో విద్యార్థుల భావిజీవితమున వివిధముగను ఉపకారులు కాని, వినియోగములేని విషయములను ఇప్పటికంటె ఎక్కువ నేర్పుటకు యత్నించుటకు మంచిదని సూచించగోరెదము. ఈఆశయముతో వర్ధా విద్యామహాసభవారి తీర్మానములనుకూడ మనరాష్ట్ర పరిస్థితులకు తగినట్లు ఆచరణలో పెట్టుటకై విద్యాశాఖవారు ఆలోచించి ప్రయత్నించవచ్చును. అందు ఆంధ్రమహాసభయు ఈవిషయమై ఆలోచించుట చాల లాభకరమని మా అభిప్రాయము. మాదృష్టికిపరభాషనువదలి జీవితో గావలగు విషయములు సంపూర్ణముగ మాతృభాషనే బోధించవలెననునుద్యానమపై ఆధారపడియున్న వర్ధా విద్యామహాసభ నిర్ణయము నిజముగా మన ఈరాష్ట్రస్థుల నెత్తికెత్తి కొలగించుటకు కుదురుకొనగ నిది మావిశ్వాసము.

---

## నిజామాబాద చారిత్రిక ప్రదేశములు

### ప్రాచీనాంధ్రుల పతిభను జ్ఞప్తికి దెచ్చు దృశ్యములు

(గోలకొండ ప్రత్యేక ప్రతినిధి)

కొంపు రైతునగరము.
నిజామాబాదు డిసెం ౧.

ఈ పట్టణమునకు అసలు పేరు "ఇందూరు" ఇందూరు పేరుగల పట్టణములు పెక్కులున్నందున వ్యవహార సౌకర్యమునకు అప్పటి అవ్వల్ తాలూకదారు జహూజంగు సా॥ కాలములో (౧౩౦౯ ఫ) "నిజామాబాద" అని పేరు మార్చబడినది ఈ పట్టణములో పశ్చిమదిక్కున యున్న ఖిల్లాయందున్న రామాలయము ఖిల్లాకు దక్షిణమందున్న రఘునాథ తాలాబు (చెరువు)ను పట్టణములో తూర్పుదిక్కున యున్న కోట (శిథిలము) యును చూచువారలకు యీ పట్టణము చరిత్రాత్మక మైనదని విశదమగును ప్రాచీనాంధ్రుల యశోసంపద జ్ఞప్తికి తెచ్చును. ఆనందమును విచారమును కలుగజేయును పదియేనవ శతాబ్దమునకు మధ్యముండెడి ౧ అహమ్మదునగరము (నిజాంషాహి) ౨ గోలకొండ (కుతుబుషాహి) ౩ బీజాపూరు (ఆదిల్ షాహి) అను మూడు మహమ్మదీయ రాజ్యములలో ఆంధ్రదేశమంతయు గోలకొండ రాజ్యమునకు యీ యూరు చెందినది ఈ మూడు తురుష్క రాజ్యములను మన యాంధ్రరాజులు గెలిచియుండిరి, శ్రీకృష్ణ దేవరాయలు యీ రాజ్యము లన్నింటిని గెలిచిన మాట జగత్ప్రసిద్ధము. తాలికోట యుద్ధములో ఓడిన రామరాజు తండ్రి రంగరాజుకూడా యీ రాజ్యత్రయము గెల్చెనని యీ క్రింది విధముగా రామరాజీయములో వ్రాయబడియున్నదని కీర్తిశేషులైన శ్రీ అక్కిరాజు గారు వ్రాసియుండిరి.

సీ॥ కడువిజాపురవర కామినీగర్భముల్
భేదించు నెవ్వని ఘోరనము,
దామిడిబోయి నిజాము పట్టణముల
ధూళిగాజేయు నే దోర్బలంబు
గోలకొండవజీర్ల కోటలకాయముల్
చించునే రాజేంద్రు చేకత్తి
సకల భూపాల కాస్థాన సన్నుతి
గాంచి
వెలయు నే శూరుని విజయలక్ష్మి
యతడు కేవల నృపతియే
యఘ! దూర
చర్యు డాశ్రిత రక్షావిచక్షణుండు
జీర్ణకర్ణాట భూపునర్జీవనుండు
రమ్యగుణశాలి శ్రీ రంగ
రాయమౌళి

మహారాష్ట్ర మహావీరుడు శివాజి దక్షిణ హిందూస్థానమునకు సరాసరిగా దాడిపోయెడి మార్గమందీయూరు యుండెడిది గోలకొండ సుప్రసిద్ధ మంత్రిపుంగవులయిన అక్కన్న మాదన్నగార్ల చాతుర్యమువలన తానీషా అబుల్ హసనుకు శివాజితొ మైత్రి కలిగియుండుట ఆకాలములో యీ యూరికు గాని తదితర ప్రాంతములకు గాని శివాజి బాధ కలుగజేయలేదని స్పష్టపడుచున్నది గాని "ఠగుల" (Thugs) వల్ల తరుచుగా యీపట్టణము పీడింపబడుచుండెడిది ఇప్పుడు మన శ్రీ నిజాం ప్రభుత్వమువారి సత్పరిపాలన వలన ఆటి యుపద్రవములు నశించిపోయి ప్రజలు నిర్భయముగా బ్రతుకుచున్నారు. ఇప్పుడీపట్టణము జిల్లాకు ముఖ్యస్థానముగా యుండి హైదరాబాద మన్మాడు ఆయోమార్గమందున్నది రైలు వేశలయందు స్టేషనులోను యితరవేళలయందు పట్టణములోను మోటార్లు, టాంగాలు, ఒంటెద్దుబండ్లు దొరుకును. ఇక్కడినుంచి డిచ్పల్లికి యొక రోడ్డుమార్గమును, ఆమూరుమీదుగా పెరకేడుకు మరియొక రోడ్డు మార్గమును హైదరాబాద నాగపూరు టంకురోడ్డులో కలియుచున్నవి మరియు కరీంనగరు వరకుండి మరి యొక రోడ్డుమార్గము పెరకేడువద్ద హైదరాబాద నాగపూరు టంకురోడ్డులో కలియుచున్నవి పరిమిదుగా యొకటియు బోధనమీదుగా మరి యొకటియు నిజాంసాగరుకు రెండు రోడ్డుమార్గములు గలవు ఇక్కడనుంచి నిజాంసాగరుకు, మంచిప్పకు, రామాయంపేటకు సరాసరి రైల్వేవారి మోటారు బస్సు మార్గములున్నవి ప్రభుత్వ కార్యాలయములన్నియు గలవు బ్రిటిషుపోష్టు, బ్యాంకులు లేవు రైలుస్టేషను తోడంచి సమాచారములకు సౌకర్యమున్నది పట్టణమందంతట విద్యుద్దీపములు నిటిపంపులు యున్నవి గత జనాభా ప్రకారము జనసంఖ్య ౧౫౬౮౩ గాని యిప్పుడు విస్తరించి పోయినది ఈజిల్లా ౫ తాలూకాలు ౫౩౫ గ్రామములు ౫౦౦౧౨౦ జనాభా గలది. ముఖ్యమైన కొన్ని ప్రసిద్ధస్థలములు.—

౧ ఖిల్లా—ఆంధ్రరాజుల కాలమునాటి ఎత్తైనగుట్టమీద యున్నది ఖిల్లాగుట్ట శిథిలముల మైన రామాలయము గలదు ఖిల్లామాత్రమే ప్రస్తుతము జైలుగా యుపయోగపడుచున్నది, ౨. రఘునాథ తాలాబు (చెరువు)— ఖిల్లా యున్నగుట్టకు పడమరను దుగల పెద్ద జలాశయము దీనినుంచి పట్టణమునకు రాత్రింబగళ్ళు విరామములేకుండా పంపులగుండా నీరు సరఫరా చేయబడుచున్నది ౩, కోట—ఇది యునుకు ఆంధ్రరాజుల కాలమునాటిదే నలుదిశల బలిష్ఠములైన మట్టిప్రాకారములు, ఉత్తర దక్షిణదిక్కులందు యెత్తైన సింహద్వారములు రెండుగలవు. ఉత్తరప్రాకారము పూర్తిగాను పశ్చిమప్రాకారము కొంత భాగమును సర్కారుచే త్రవ్వించి వేయబడినది. కోటలో దక్షిణ భాగమున హిందూదేవాలయ(శిథిలము) మొకటి గలదు ఈ దేవాలయమెదుట కొన్నియును, ఉత్తరసింహద్వారమునకు చేరి మరికొన్నియు, మహమ్మదీయ సమాధులున్నవి. హిందువులిండ్లు తక్కువగాను మహమ్మదీయులిండ్లు యెక్కువగాను గలవు ౪, అలీసాగరు—౮ మైళ్ల దూరమందున్నది దీనిప్రక్కనున్న యెత్తైనగుట్టమీద యిన్స్పెక్షను బంగాళాయున్నది ౫ నిజాంసాగరు ౪౬ మైళ్ల దూరమందున్నది. నిజాంరాష్ట్రములోకెల్ల గొప్పజలాశయము, హిందూస్థానములోని గొప్ప జలాశయములలో నిది యొకటి. స్వతశ్చాలిత తలుపులు (Automatic shutters) గలవు, ఈ జలాశయాధారమున నిజామాబాద జిల్లాయందంతట తరి సాగు వున్నది ౬ బోధను—౧౬ మైళ్ల దూరమందున్నది పౌరాణికమైనది పాండవులు మాతృకతోకూడ యొకసంవత్సర కాలము నివాసముండిన యేకచక్రపుర అగ్రహారము యీ బోధనయే బకాసురుననే రాక్షసుని భీముడు వధించిన దేశము యీ బోధనయే బకాసుర వధ నిదర్శనములున్నవి, ౭ మంచిప్ప— ౧౨ మైళ్ల దూరమందున్నది దట్టమైన యడవి గొప్ప చెరువు గలదు ౮ ప్రసిద్ధికెక్కినది ౯ డిచ్పల్లి— ౧౪ మైళ్ల దూరమందున్నది అతి పురాతనమైన దేవాలయము యున్నత ప్రదేశమందున్నది దీని శిల్పనైపుణ్యము చూచితీరవలయును క్రిందిభాగములో గొప్ప చెరువుకూడా గలదు ౯ పోచారం— ౩౬ మైళ్ల దూరమందున్నది గొప్పచెరువు దీని యాధారమున కొన్నిగ్రామముల భూములు తరి సాగుయగుచున్నవి దీనికి స్వతశ్చాలిత ఒరుగు ద్వారములు (Auto matic tilting gates) యున్నవి.

---

## ౭ లక్షల భూమి పన్ను బాకీలు రద్దు

డైమండు జూబ్లీ సందర్భమున కపుర్తల మహారాజుగారు ప్రజలకొసగిన వరములు

కపుర్తల ౨౯ నవం॥

పంజాబులో చేరిన కపుర్తల సంస్థానము యొక్క ప్రభువుగారు సింహాసనమెక్కి ౬౦ ఏండ్లు నిండుటచే డైమండు జూబిలీ మహోత్సవము చాల వైభవముతో జరుపబడెను ఆ సందర్భమున నేడు జరిగిన రాజసభలో మహారాజుగారు గొప్పవారల దరు ఇచ్చిన నజరు అను సంతోషముతో నందుకొని, తమ ప్రజలకు ఈ కిందివరములు నిచ్చినట్లు ప్రకటన చేసిరి

౧ ఈ డైమండు జూబిలీ ఉత్సవమునకై ప్రజలనుండి చందాలు చేసిన ద్రవ్యమునకు ప్రభుత్వమువారు రూ ౨౫వేలు కలిపి సంస్థానములో ప్రతిహాసీలులోను ప్రజోపయోగకార్యములకై వినియోగించుటకు ౨ ఢిల్లీవరులో ఉన్నత పాఠశాల యొకటి స్థాపించబడును ౩ పెనిటెన్షయరిలో ౬ నెలల శిక్షగాని అంతకు తక్కువకాలపుశిక్షగాని అనుభవించుచున్న ఖైదీలందరును వదలివేయబడుదురు. ౬ నెలలకు మించి కాలపుశిక్ష అనుభవించుచున్నవారు! శిక్షలలో సంవత్సరమునకు ఒక నెల శిక్ష తగ్గించబడును ౪ ప్రభుత్వోద్యోగుల జీతములు, వాటిలో ఇటీవల చేయబడిన తగ్గింపు, గారికిచ్చుచున్న అలవెన్సులు, విశ్వాసముగ ఉద్యోగమునుండి విరమించవలసిన వయః పరిమితి—వీటిని గూర్చి ఒక కమిటీ విచారించి ఉద్యోగుల సంతృప్తికై చేయునటుల మహారాజుగారు సామ్రాజ్యములతో విచారించుచు ౫ సంస్థానము నందలి మహారాజా ఆయోమ్ముఖ ఎస్టేటులలో రైతులు చెల్లించవలసిన బాకీలన్నియు, సూరెకులు రద్దు చేయబడును ఇకముందు ఆ రైతులు ఇదివరకే ప్రత్యేకపు పన్ను చెల్లించవలసిన నేల మీదను, గ్రామ ఎల్లక్కువ ఉండి తడిపడి యున్న సొంతచెట్లు నరికికొనవచ్చును

---

## ఆంధ్ర మహాసభ

**౩, ౪, ౫, బహిమన్ ౧౩౪౭ ఫ. సోమ, మంగళ, బుధ, వారములలో నిజామాబాదునందు జరుగును**

మహాసభాధ్యక్షుడు.

### మందుముల నరసింగరావుగారు

మహిళాసభాధ్యక్షురాలు

### నందగిరి ఇందిరాదేవి గారు

ఆయుర్వేద మహాసభ అధ్యక్షుడు.

### సురవరము ప్రతాపరెడ్డి గారు. బి. ఎ., బి. ఎల్.

ప్రత్యేక రైలుబండి హైదరాబాదునుండి నిజామాబాదుకు రాను పోను మూడవ తరగతి రూ. ౩—౧౨—౦

వ్యవసాయ, పశువైద్య, పారిశ్రామికాది ప్రదర్శనములు జరుగును.

భోజనపు యేర్పాట్లు ఉచితము.

సోదర సోదరీమణు లందరు పాల్గొన ప్రార్థితులు.

ఆహ్వానసంఘ కార్యాలయము నిజామాబాద. } వేంకటభూమారెడ్డి, అధ్యక్షుడు. బి. కేశవరావు. సుబ్బారెడ్డి. } కార్యదర్శులు.

---

## మలయాలో గాంధిటోపి పవిత్రత

నిజము కనుగొనుటకు ప్రమాణ చేయించుట మంచిసాధనము

మలయాలో భారతదేశమునుండి పనులకై పోయినవారలున్నారు వారలు గాంధిటోపీని ఎంత పవిత్రముగా భావించుచున్నారో కుతలంపూరు అను చోటినుండి వెలువడు "ఇండియన్" అను పత్రికలో ప్రకటించబడిన ఈ భ్రాంతీయులను గూర్చిన వృత్తాంతముల వలన తెలియును.

గాంధీటోపీని ధరించిన ఇరువురు భారతీయ కార్మికులు త్రోవన నడుచుచు పోవుచుండిరి వారిలో ఒకరు రెండవవానిని ఏవరాని మాటలనెను అంత నారెండవవాడు "ఆరే! ఇక్కడ మాడు, ఆటువంటిమాటలు మాట్లాడుటకుముందు గాంధీటోపి తీసివేయ్ నీవునన్ను తిట్టినా ఫరవాలేదు ఇంతవరకును స్నేహితులము, కాని నీవు గాంధీటోపీకి అవమానము కలిగించకూడదు." వెంటనే నీచమునాడిట్టున్నవాని కోపము ఎక్కడికో ఎగిరిపోయెను వారిరువురు మైత్రితో నడచిపోయిరి

ఇంకొకప్పుడు కొందరు ప్రాంతీయ కార్మికులు ప్రభుత్వమువారి కల్లుకొణములనుండి మరలివచ్చుచు దీపావళికి ఈసారి ఖద్దరు కొందమాయని విషయమై మాట్లాడుచుండిరి, అందొకడు మరొకనిని "నీవు మొన్న గాంధీటోపీ కొన్నావుగదా! దానినెందుకు పెట్టుకోవు? నీవుదానిని ఇతరులకు చూపించడానికేనా కొన్నది మంచి ఖద్దరు ఖద్దరంటావు," అని అడిగెను, అందుకు రెండవవాడు ఇట్లు జవాబుచెప్పెను. "లేదు లేదు! నేను దానిని పెట్టుకొంటూ లేనున్నాను అయితే కల్లంగడికిపోయేటప్పుడు గాంధీటోపీ పెట్టుకో కూడదని నీకు తెలీదా? అది పెద్దపాపము"

అక్కడి కూలివాండ్ల అధికారియగు "ఇండియన్ యక్స్ప్రి అసిస్టెంట్ కంట్రోలర్ ఆఫ్ లేబర్" వద్దకు ఒక ఫిర్యాదువచ్చెను ఫిర్యాదు నిరాధారముగానున్నట్లు ఆ అధికారికి అనుమానము కలిగెను

ఆ అధికారి గాంధిటోపి నొకదానిని తెచ్చి ఫిర్యాదుచేసినవాని ఎదుట చేతబట్టుకొని ఇట్లనెను "ఇక్కడ చూడు! ఇది గాంధీటోపి మహాత్మ చిహ్నమిది గాంధీమహాత్ముడు,అతనికి ప్రపంచమంతయు ఇచ్చినను అసత్యము చెప్పడని నీకు తెలుసుగదా. అతడు తనప్రాణమునే త్యాగముచేసినాడు, ఇప్పటికిని చేయుచున్నాడు —— —ఎవరికి? నావంటివరలకోసంకాదు, నీవంటివారలకోసం ఈటోపి నెత్తినపెట్టుకొని నిజంగా ఏంజరిగిందో చెప్పు. ఈటోపి నెత్తిన పెట్టుకొని అబద్ధం చెప్పితివా, నీవు గాంధీజీని మోసగించినట్లే" ఫిర్యాదు తెచ్చినవాడు ఫిర్యాదుకథ మార్చివేసి, నిజము చెప్పెను ఇది ఆశ్చర్యము

---

## అలుగడ్డ మొలకపై టమాటోకాయలు కాచుట

ఈస్ట్బోర్న్లో యఫ్ వాను వతిగారి తోటలో ఒక అలుగడ్డ మొలకపై టమాటో కాయ కాచెను

---

## మహారాజుగారి చిలుకలు రైతుల భక్షించుట

కచో సంస్థానాధిపతియొక్క షికారియ్యవనము విచిత్రరూపము దాల్చినది. అని "ఇండిపెండెంటు" పత్రిక వ్రాసినది

"వారు ఆఫ్రికా అడవులనుండి ఒక చిలుకల మందను దిగుమతిచేయించి వాటిని ఆ సంస్థానపు అడవులలో విచ్చలవిడి గావదలినారు. అక్కడి వారికి కోరిక కలిగినపుడెల్ల వారు వేటాడబోవుచుందురు

"దీనివల్ల దురదృష్టవంతులైన కచ్ప్రజలప్రాణములకపాయము కలుగునని చోమాకు కచ్ప్రభువు గారితో విశ్వాసమేమియులేదు కాని ఇటీవలను ఆ చిలుకలచేతిలో ౨౨ మంది చంపబడిరనియు ౪౨ మంది గాయపడిరనియు మాకు తెలుపబడినది దీనినిబట్టి మహారావు గారు అధికతరవసతి,భోజనముల విషయములో చాలినంత శ్రద్ధను పాటించలేదని స్పష్టమగుచున్నది.

"ఇటువంటి సంస్థానాధిపతులట, లేపు ఫెడరేషనుగతిని నిర్ణయించునది."

---

## అండమాన్నుండి ౧౦౦ మంది నిర్బంధితులు తిరిగివచ్చుట

కలకత్తా నవ. ౨౮

కలకత్తా ప్రభుత్వమువారు త్వరలోనే అండమాన్నుండి ౧౦౦ మందినిర్బంధితులను స్వదేశమునకు రప్పింపనిశ్చయించినట్లు తెలియుచున్నది గత మూడుదివసములనుండి సుమారు ౩౦౦ నిర్బంధితులను విడుదలజేసిరి. మరికొందరిని విడుదల చేయుచున్నట్లు గలదు.

గృహములలో నిర్బంధింపబడిన స్త్రీలను సహితము ప్రభుత్వమువారు విడుదలజేయుటకు నిశ్చయించి ప్రస్తుతము ౧౨ స్త్రీలను వదలివేసిరి.

---

## సోదర సోదరి పెండ్లి

డొమెనికో సిన్సిర్ అను యువకుడు ఇటలీదేశమందు మిలానులో యామాక్ మ్యానిక్ లో ఒక ధనికుని ఒంగళలో పనిచేయుదానివద్దకు చీటికిమాటికి పోవుచుండుటను పోలీసులు చూచి అందుకు సమాధానమడిగిరి అప్పుడా యువకుడు తానాయువతిని ప్రేమించియుంటినని చెప్పెను. ఆయువతి ఎవరో పేరునువిచారించగా "జవాన్నసిన్సిర్" అని చెప్పబడెను అప్పుడు యువకుని కాశ్చర్యమయ్యెను. పోలీసులు ఇంకనువిచారణచేయగా పోయిన పదిహేనుసంవత్సరములలో గందరగోళమున తల్లిదండ్రులు ఆ బాలిని పారవేసిపోగా ఇటలీసైనికులకు ఆ బాలుడు చిక్కెననియు, ఆబాలిక అతని సోదరియేననియు తేలెను.

---

కాన్స్టేడ్జ్ క్రిస్ట అడేకోటలో రేగుచెట్టుపై టమాటోకాయకాచెను అదేవిధముగ రేగుపండ్లు ఒత్తుగను లేవని కాచినవి.

# ప్రజా స్వాతంత్ర్య ప్రభుత్వ మేర్పడవలెను

## ఫెడరేషన్ భారతదేశ అభివృద్ధికి ప్రతిబంధకము

### పట్టాభిగారి పదకొండు షరతులు

తిరువాన్కూరు నవ ౨౩

“మనకు కావలసినది స్వరాజ్యమనియు, పూర్ణస్వరాజ్యమనియు నొక్కి వక్కాణించుచుండవలెను. ఫెడరేషన్లో అంతర్భాగముగా చేరియుండు వివిధ ప్రాంతములు ప్రజా స్వపరిపాలనము గలవై యుండవలెను ఇప్పుడు మనకు ప్రసాదింపబడనున్న భారతదేశము భద్రముగా వశమైయుండగలదు కాని భారతీయులకు భారతదేశము భద్రముగానుండుటకు సంకల్పింపబడిన సమాఖ్య ఇదికాదు” అని నేడు తిరువాన్కూరు రాజకీయమహాసభ కధ్యక్షత వహించుచు డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు తమ ఉపన్యాసమందు తిరువాన్కూరు ప్రాముఖ్యతను, సాహిత్య, పారిశ్రామిక అభివృద్ధి, ఫెడరేషన్ సమస్యలను, ప్రజాపరిపాలనా ప్రాముఖ్యతను విరివముగా వర్ణించుచు యిట్లు తెలిపిరి.—

తిరువాన్కూరు సంస్థానములో రమణీయమైన ప్రకృతితో గణుతింపదగినది కన్యాకుమారి అగ్రమను పవిత్రక్షేత్రము మా సంస్థానములో నున్నది. అంతియగాక చిత్రసంస్కారవికాసము గలిగి సంస్థానములలో కెల్ల మిన్నయై వృద్ధిలోకి వచ్చుచున్న సంస్థానమిది. బ్రిటిషు పరిపాలకులకును, ఇతర భారతీయపరిపాలకులకును అభేద్యమైన క్లిష్ట సమస్యగానుండిన హరిజనదేవాలయప్రవేశవిషయములో ఈసంస్థానము అందరికి మార్గదర్శియై ముందంజవేసినది లౌకికతంత్రవాసనలవల్ల కళంకమునుపొందనట్టి ఉత్తమాదర్శపూరితుడైన ఈసంస్థానప్రభువు తనతల్లిగారి సదుపదేశదోహదమువల్ల తన యంతరాత్మ ప్రేరేపించినరీతిగా సత్యమార్గమునుగ్రహించి కాలక్రమాను గతమైన మూఢాచారముల నెదిరించి దురభిమానములనుపారద్రోలి తనసంస్థానములో ఆలయ ద్వారములను తెరచి హరిజనులను ఆహ్వానించెను. ఇంతకంటె వయోవృద్ధులైన పెద్దప్రభువులుకూడ యింతటి ధైర్యముతో వ్యవహరింపజాలకపోయిరి గాంధీమహాత్ముడు మా సంస్థానమునకు వచ్చెనని, మాచే అమలుపరచిన ఈ నూతనసంస్కరణము సువర్ణాక్షరిగా హరిజనోద్ధరణార్థమేయని, స్వయముగా గ్రహించిరి.

సాహిత్యాభివృద్ధి

చెంపనున్న బ్రిటిషు ప్రాంతమునకును, ఈ సంస్థానమునకును విశేషవ్యత్యాసము కనుపించదు. సంస్థానములోని కచ్చేరీలయందు ఉదయము ౭–౩౦ గంటలు మొదలుకొని ౧౨–౩౦ గంటలవరకును అనగా రోజుకు ౫ గంటలు ఉద్యోగస్థులు పనిచేసినయెడల ఆరోజుకు పూర్తికావలసినపనియావత్తు పూర్తికాగలదని ఈ సంస్థానప్రభుత్వము నిర్ణయించెను తిరువాంకూరులో హిందూవితంతువుల పునర్వివాహమునకుగల ప్రతిబంధకములను తొలగించుచు ఒకచట్టము ఆమోదింపబడెను. కేరళరాష్ట్రమునకొక విశ్వవిద్యాలయము లేనిలోపమును వారించుటకు ౧౯౧౯ సం॥లో కర్ యం, కృష్ణస్వామయ్యగారు తిరువాన్కూరు దివాను నుండి నప్పుడే కృషిచేసిరి. నేటికది సర్ సి.పి రామస్వామయ్యర్ గారి దివానుపదవి కాలములో సిద్ధించినది. కేరళకళావిజ్ఞానమును వికసింపజేయుటకును భౌతికశాస్త్రములను పారిశ్రామికవిద్యలను వృద్ధిచేయుటకే విశ్వవిద్యాలయము ఎక్కువగా కృషిచేయునని మాదివానుగారు ఇటీవల చెప్పియుండిరి. సాహిత్యాభివృద్ధికిని చరిత్రపరిశోధనలకును మాసంస్థానము సాయముచేయుచు ఆదరించుచున్నది.

పారిశ్రామిక అభివృద్ధి

పరిశ్రమలకు అక్కరకువచ్చెడి భౌతికశాస్త్ర పరిశోధనలనుచేసి శాస్త్రజ్ఞానమును యంత్రజ్ఞానమును వృద్ధిచేసినంతమాత్రమున ప్రయోజనము లేదు. అట్టి శాస్త్రజ్ఞానమును ప్రయోగించుటకు తగిన పరిశ్రమలు ఫ్యాక్టరీలు కార్ఖానాలు వృద్ధికావలెను కనుక అట్టిదేశీయ పరిశ్రమాభివృద్ధికి తోడ్పడగల కేంద్రప్రభుత్వమొకటి యుండవలెను. అట్టికేంద్రప్రభుత్వముతో యావద్భారతదేశము పరిశక్తి గలిగి యుండవలెను భారతదేశములో ౫౬౧ స్వదేశ సంస్థానములు కలవు బ్రిటిషు పరగణాలైన ౧౧ రాష్ట్రములుకలవు ఇప్పుడు మనకొక సమాఖ్య ప్రభుత్వవిధానము (ఫెడరేషను) ప్రబోధింపబడనున్నది, ఈ ఫెడరేషనువల్ల బ్రిటిషువారికి భారతదేశము భద్రముగా వశమై యుండగలదు కాని, భారతీయులకు భారతదేశము భద్రముగా నుండుటకు సంకల్పింపబడిన సమాఖ్య ఇదికాదు ఈఫెడరేషనులో తిరువాన్కూరు సంస్థానము చేరునా యను విషయములో మా సంస్థానప్రభుత్వమొక ప్రకటన చేసియుండెను. బాధ్యతాయుత ప్రభుత్వమున్ను, సార్వజనిక హక్కులను కావలెనని మావులో చాలిరిగాని ప్రధానాంశమును మరచిపోయితిరి ఫెడరేషను మా సంస్థానము పక్షమున ఎన్నుకొనబడు ప్రతినిధులు సంస్థానప్రజలచే ఎన్నుకోబడవలెను అట్టి ప్రసంగము ఆ ప్రకటనలో లేనేలేదు మా ప్రకటనలోగల అంశము లన్నియును దేశమున్నయుండు ఉండవలసిన వ్యవహారిక కట్టుదిట్టములగురించియే, కాని, పరిపాలనలతో సంబంధించిన వ్యవహార విషయముల గురించి కాదు.

ఫెడరేషను సమస్య

తిరువాన్కూరు సంస్థానము ఫెడరేషనులో చేరేయెడల తిరువాన్కూరు సంస్థానపు వోడరేవులలో సాలీనా వసూలగుచున్న ౪౦ లక్షలును ఇండియా గవర్నమెంటుకు చెందకలయు గనుక, ఫెడరేషనులో చేరకపోవుటయే మంచిదనితోచును, కాని, ఎప్పటికైనను భారతదేశమంతటను ఒక్క సమిష్టి ప్రభుత్వము యేర్పడవలెను. భారతదేశములోని కొన్ని భాగములు విదేశీయుల ఏలుబడిన ఆశ్రయించుచు మరికొన్ని స్వపరిపాలనమును అనుభవించుచుండుటకు వీలులేదు అట్టి సమస్యలో సంస్థానములన్నియును చేరవలెను, అరీతిగా చేయుటకు తిరువాన్కూరు సంస్థానము తనకుతోచిన షరతులను తానుకోరవచ్చును మరి, కేరళపుత్రులు అట్టి ఫెడరేషనులో భాగస్వాములుగానుండక తప్పదు

తిరువాన్కూరులోని తియ్యా సంఘమునకు ప్రత్యేక నియోజకవర్గములనురద్దుచేయవలెనని తియ్యాలు కోరినట్లుగా తెలియుచున్నది ఇతర నియోజకవర్గములలో హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గములు రద్దుచేయబడినట్లుగా నే తియ్యాలకుగూడ రద్దుచేయుబడవలెను.

కాంగ్రెసువారితో సంబంధించిన పరిశ్రమలకంటెను ముఖ్యముగా చేనుగ్గము నేతపరిశ్రమను మీరు వృద్ధిచేయవలెను తిరువాన్కూరు రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ తీర్మానించెను పేదజనుల దారిద్ర్యమును తొలగించవలెనని మీరు కృతనిశ్చయులైనట్లుగా పై తీర్మానమువల్ల బోధపడుచున్నది సాంఘిక సామరస్యము, మద్యనిషేధము హిందీప్రచారము జరుగవలెనని మీరు కోరుచున్నారు, కనుక కాంగ్రెసు కార్యవిధానముచే అనుష్ఠించుచున్నారు

ప్రజాపాలన

మాకు కావలసినది స్వరాజ్యమనియు పూర్ణరాజ్యమనియు ఇచటి కాంగ్రెసుకమిటీ నొక్కి వక్కాణించుచుండవలెను, ఫెడరేషన్లో అంతర్భాగములుగా చేరి యుండు వివిధ ప్రాంతముల ప్రజా స్వపరిపాలనము గలవై యుండవలెను తిరువాన్కూరు సంస్థానము ఫెడరేషన్ చేరుటకు ప్రజా స్వపరిపాలనముగలదై యుండవలెను, అనగా యీసంస్థానములో (౧) ప్రజలకు బాధ్యతవహించిన ప్రభుత్వము (౨) సార్వజనికమైన పౌరసత్వములు (౩) పత్రికాస్వాతంత్ర్యము (౪) యుక్తవయస్కులకు ఓటింగుహక్కు (౫) పౌరసత్వ సంరక్షణసంఘము (౬) నిరుద్యోగ సమస్యా పరిష్కారము (౭) పన్నుల విధానమును తిరిగి నిర్ణయించుట (౮) పరిపాలనా వ్యయకర్తనము (౯) పరిశ్రమాభివృద్ధి (౧౦) కర్షక కార్మికజన సౌకర్య స్వాతంత్ర్యములు (౧౧) ఉద్యోగములలో అందరికిని సమానావకాశములు

గ్రామోద్ధరణ

గ్రామాలు వృద్ధిలోనికిరావలెనంటే మతవైషమ్యములు కుల వైషమ్యములు గ్రామ వ్యవహారములలో రాకూడదు కాని ఆయా వృత్తులనుబట్టి ఏర్పడిన సంఘములకు సంస్థాన ప్రభుత్వము ప్రోత్సాహము నొసంగవలెను

ఫెడరల్ శాసనసభలో తిరువాన్కూరు సంస్థాన ప్రజలకు ప్రాతినిధ్య ముండవలెను తిరువాన్కూరు సంస్థానము తరఫున ఫెడరల్ శాసన సభయందు దిగువ సభలో ౫ గురు ప్రతినిధులు ఎగువసభలో ఇద్దరు ఉండవలెను ఆ ప్రతినిధులు సంస్థాన ప్రజలచే ఎన్నుకోబడినవారై యుండినప్పుడే సంస్థాన ప్రజల హక్కులు సురక్షితములై యుండగలవు

రాబోవు ఫెడరేషన్లో నిజముగా మనకు ఒప్పగింపబడిన అధికారము చాల తక్కువ రైల్వేరేట్లను తగ్గించుటకు రైల్వేశాఖామంత్రికి అధికారములేదు మారకపురేట్లు రిజర్వుబ్యాంకు చేతిలో నుండును కొలాగార మంత్రికి సలహాదారుగా ఒక ఆర్థిక వ్యవహార ప్రవీణుడు పనిచేయును అనేక అంగరక్షులను బ్రిటిషువారేర్పరచుకొనినారు.

ఫెడరేషను అమలులోనికి వచ్చునా రాదా యనే విషయము భగవంతునకే తెలియవలెను ఏది ఎట్లున్నప్పటికిని ప్రజా స్వాతంత్ర్య ప్రభుత్వమును ప్రతిష్ఠించుటలో తిరువాన్కూరు సంస్థానము ముందంజ వేయవలెను జనవాక్యమే దైవవాక్యముగా భావించి ప్రభువైనవాడు తన ప్రజలకు ధర్మకర్తగా నుండవలెను ప్రజలకు భగవంతునకు మధ్య మధ్యవర్తిగా వ్యవహరింపవలెను దేశ సౌభాగ్యము కలుగ వలెనని యు పెద్ద సత్కార్యం ఆసన్నమగుటకై ఈ సంస్థాన ప్రభుత్వము కృషిచేయవలెను













# మ. ఘ. వ. నైజాం స్టేటు రైల్వే

## 15—12—1937 నుండి మెయిల్ లైన్ బండ్లు హుసేన్ సాగర్ జంక్షన్ మరియు ఖైరతాబాదు స్టేషన్లవద్ద ఆగుట

15-12-1937 తేదినుండి శికింద్రాబాదు మరియు హైదరాబాదు మధ్య నెం. 101 మటిల్, 3 ప్యాసింజరు, 1 అప్ ప్యాసింజరు 12 అప్, 11 డౌన్, 101 డౌన్, 1 డౌన్, మరియు 12 ప్యాసింజరు బండ్లు యీ క్రింది కాలములలో, ప్రయాణీకులను ఎక్కించుకొనుటకును, దించుటకును, హుసేన్ సాగర్ జంక్షన్ వద్దను, మరియు ఖైరతాబాదు స్టేషన్లవద్ద పరీక్షార్థము ఆగును.

రాకపోకల పూర్తికాల పట్టిక:—

### శికింద్రాబాదు నుండి హైదరాబాదు బి. జీ.

| | | 101 మటల్ | 3 ప్యాసిం. | 1 అప్ ప్యాసిం. | 12 అప్ |
|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని | గం. ని. | గం. ని |
| శికింద్రాబాదు | పోక | 8-50 | 9-12 | 17-10 | 18-14 |
| జేమ్సుస్ట్రీట్ | ,, | 8-56 | 9-19 | 17-17 | 18-21 |
| హుసేన్ సాగరు జంక్షన్ | రాక | 9-01 | 9-24 | 17-22 | 18-26 |
| | పోక | 9-02 | 9-25 | 17 23 | 18-27 |
| ఖైరతాబాదు | ,, | 9-08 | 9-31 | 17-29 | 18-33 |
| హైదరాబాదు బి. జీ. | రాక | 9-16 | 9-40 | 17-38 | 18-42 |

### హైదరాబాదు బి. జీ. నుండి శికింద్రాబాదు

| | | 11 డౌన్ | 101 డౌన్ | 1 డౌన్ | 12 పాసింజరు |
|---|---|---|---|---|---|
| | | గం. ని | గం ని | గం. ని | గం ని |
| హైదరాబాదు బి. జీ. | పోక | 7-11 | 9-58 | 16 10 | 18-55 |
| ఖైరతాబాదు | ,, | 7-20 | 10-07 | 16 19 | 19-04 |
| హుసేన్ సాగర్ జంక్షన్ | రాక | 7-27 | 10-12 | 16-26 | 19-11 |
| | పోక | 7-37 | 10-13 | 16-27 | 19-12 |
| జేమ్సుస్ట్రీట్ | ,, | 7-42 | 10-18 | 16-34 | 19 19 |
| [illegible] | రాక | 7-50 | 10-26 | 16 40 | 19-25 |

